

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం

సత్ సత్

శ్రీ సద్గురు పరబ్రహ్మణే నమః

శ్రీ బాలా త్రిపురసుందరీ దేవతాయై నమః

కర్మ, భక్తి, జ్ఞాన సూత్రములు

సర్వజన వుపయోగార్థమైన

# సర్వేశ్వర శతకము.

గ్రంథకర్త:

శ్రీ శ్రీ శ్రీ


బ్రహ్మశ్రీ ఆనందస్వాములవారిచే


రచియింపబడి

చిట్టా అంకిశెట్టిగారి

ద్రవ్య సహాయంబున


గుంటూరు లలితా ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

మొదటి కూర్పు 1000 ప్రతులు.

1938. [ వెల రు. 0—4—0

# సర్వేశ్వర శతకము.

సీ॥ నీవుండు భవనంబు నిర్మలరజితాద్రి
నీసతీమణి హిమజాత జూడ
నీవు యెక్కినది నెపుడైన వృషభంబును
నీనగలన్ని సర్పములు జూడ
నీవు హస్తమునపట్టినది కపాలంబు
నీఆయుధము త్రిశూలంబుజూడ
నీవు లయకర్తవు నీశిరంబున గంగ
నీచోట గణములు నెపుడుజూడ
నీమహిమ చంద్రధర దెలియ నెవరితరము
నీస్వభావం బసాధ్యంబు నీలకంఠ
నీత్రినేత్ర ప్రకాశంబు నిఖిలమునకు
సకలజీవైక్యభావ సర్వేశ యీశ॥ 1

సీ॥ యేజాతివారైన యేర్పడి దీపము
వెలిగించగా కాంతివిధము నొకటె
మంచిచెరువున నీరు మనుజులందరుద్రాగ
తియ్యదనంబును తీరునొకటె
యెవరు ధరించినా హేమభూషణములు
కరగించినా విలువ కాంతినొకటె
అన్ని భాషలలోన యారామునిన్ దలచ
భవహారంబైనట్టి పదము నొకటె
దేహములు వేరుజూడగ సోహమొకటె
రుచులు యెన్నైన దిను జిహ్వా రూఢియొకటె
అన్నిమాయలు హరియించు నాత్మయొకటె॥సకల॥ 2

సీ॥ మన్నించుచుండిన మనుజులదరిఁజేర
తనయుని ప్రేమించు తల్లి విధము
భార్యభర్తలు యెపుడు భావజ్ఞులైయున్న
నచట శ్రీహరి దర్శనంబు విధము
సరసత్వమును గల సంభాషణముజూడ
వికచమల్లిక మాలవేయువిధము
తనయులు సజ్జనుల్ తలిదండ్రులకు
నైన వజ్రముల్ దొరికిన వారివిధము
పేదవానికి ధాతయు పెన్నిధియగు
నీరముచె దేహసౌఖ్యంబు నిర్మలమగు
కులముకన్నను సుగుణమే ఫలమొసంగు ॥సకల॥ 3

సీ॥ వినయభావములేని విద్యాప్రసంగముల్
విషముష్టి ఫల మనుభవించినట్లు
యెపుడు దరిద్రంబు యేర్పడియుండిన
క్షయరోగి బాధయు జెందినట్లు
భర్తమోహములేని భార్యసరసంబును
యడవిలోన నెమళ్లాడినట్లు
దినము పొరుగిండ్లకు దిరుగుచునుండిన
కుక్క మర్యాద సమకూడినట్లు
సమ్మతములేనివారలచెంత కేగ
మనసు నిర్మలమును జెడి మాయజేరు
పాలుత్రాగిన నమృతమై పరిణమించు ॥సకల॥ 4

సీ॥ ఆరంభమున సేవ నధికముగా జేయ
పాకమెరుగని మగువ పలుకురీతి
దీప ఆరాధనల్ తీవ్రముగా జేయ
పాలుపొంగిన పొయ్యి పాలరీతి
భావమెరుంగని భజన పసుగురు జేయ
శృతిలేనిగానంబు శోభరీతి
మడి మైల శుద్ధియు మరిమరీగా జేయ
పిల్లవాండ్రు ధుముకు బురదరీతి
నధిక చాదస్తమంతయు సరశిజూడ
నిర్మలములేనివారల నిష్ట లివియు
అన్నిటికి మనసు స్థిరమయిన నాత్మదానె ॥సకల॥ 5

సీ॥ చందన తరువున జేరిన సర్పముల్
గరళము హరియించి గంధమగునె
కాకములకు రత్నగనులును దొరికిన
అనుభవించుట వాటి కలవియగునె
పాషండజనులకు పద్మినుల్ లభియించ
భోగించుటకు నెపుడు పొందుపడునె
కొబ్బరికాయలు కోతులకు యిచ్చిన
నందు నీరముద్రాగ నలవియగునె
ఘన సుబోధను కుమతులు గాంచగలరె
మహిని సుస్థిరపదసూత్రమైన గురుతు
పూర్వసుకృతాంశులకుగాని బోధపడదు ॥సకల॥ 6

సీ। అన్నదానము జేయునట్టి వారలకును
యిహాము కీర్తి పరము నెంచిచూడ
దిక్కులేనియట్టి దీనరక్షణులకు
యప్పుడు శుభమును గల్గు యెంచిచూడ
సజ్జనాళికి విద్య చక్కగ నేర్పిన
నిరతంబు సత్ఫలము నెంచిచూడ
పరమభక్తులసేవ పాటించి జేసిన
నెపుడు మోక్షంబును నెంచిచూడ
కలుషహారమును సద్గతి కారణంబు
యెవరు యేకర్మజేయగా యెరుటనుండు
మనసు నిర్మలమే జూడ మాయగెలువ ॥సకల॥ 7

సీ॥ సత్కర్మబాటయు చక్కగా దెలసిన
కార్యసాధనలకు కారణంబు
యేదైవమును నిశ్చయముగ పూజనుజేయ
నా దేవతయొసంగు ఆఫలంబు
దివ్యస్థలంబులు దిరిగి సేవించుచూ
భక్తియు గుదిరిన భవహారంబు
మంత్రవుపాసనల్ మరి శాంతముగజేయ
ధనము సంపదయు సద్గతిపదంబు
శుభము గల్గును సుగుణ సంపన్నులకును
సత్యశీలము దయయు సంతోషమమరు
మాయలును జేరనట్టి సన్మార్గవిధము ॥సకల॥ 8

సీ॥ సజ్జనుల విడనాడి సారహీనులఁజేర
భక్తి విద్యయును భావంబు చెడును
తనయాలి విడనాడి దాసిదానినిగూడ
తనువు రోగము మనసు ధనము చెడును
యెన్నిమాయలునేర్చి యెంతదిరిగినగాని
విటుడు విడచిన దానివిధము చెడును
పదిమంది పురుషుల ప్రౌఢాంగనాఁజేర
మాన అభిమానంబు మనసుచెడును
తెలిసి దెలియనివారల తెలివిజూడ
యీత యెరుగని మనుజుల రీతియగును
అనుభవంబైన తర్వాత నపు డెరుంగు ॥సకల॥ 9

సీ॥ చీమ యెచ్చటయున్న చెక్కెర దినుగాని
చేమయుండిచోట జేరదెపుడు
గజమాంసమును దినగోరిన సింహ్వంబు
గడ్డిదినుటకు జూడ గదలదెపుడు
చిలుక మధురఫలము స్వీకరించునుగాని
విషఫలంబునకు మరి వెదుకదెపుడు
మకరంద మనుభవించిన మధుపంబును
చాంపేయ పువ్వుల జేర దెపుడు
సాధువుల భక్తిగల్గిన సరసులకును
మూర్ఖజనులతొ మైత్రియు మోదమగునె
సత్యమును విడువబోరు సన్మార్గులెపుడు ॥సకల। 10

సీ॥ మంచినీరమె జూడ మనుజులరక్షించు
నానీరమే ముత్యమయిఫలించె
తామ్రంబు పాత్రలై దనరెను జూడగ
నాతామ్రమే హేమమై ఫలించె
మొదట ప్రియుండునై మోహంబు దీర్చెను
నాప్రియుడే సుతుడునై ఫలించె
మాలిన్యమందున మొలచిన బీజముల్
నాబీజమే భుక్తియై ఫలించె
సృష్టిజూడగ చిత్ర విచిత్ర మరయ
దుఃఖములో జూడ సుఖమును దొడరియుండు
కాలకాలము గమనించకలదు జ్యోతి ॥సకల॥ 11

సీ॥ మానంబుగాచిన మగువ పతివ్రత
బుద్ధిగలిగినవాడె పురుషుడతడు
మతముల విడచి సమ్మతముతోయుండిన
మహిలోన మహనీయమూర్తి అతడు
కొండెముల్ వినకను కొంపలుదీయక
పెడచెవిబెట్టిన పెద్ద అతడు
పేద సంసారంబు ప్రేమతోజేయుచు
గాపాడు నధితుల ఘనుడతండు
గాన మనమున భావంబుగల్గినట్టి
వసుధలో పుణ్యవంతులువారె జూడ
శాశ్వితముగాని యేపనుల్ జేయరాదు ॥సకల॥ 12

సీ॥ యెదుటవారినిజూచి యెప్పుడు సహిం
చని యింటనుండిన సర్ప విషముయగును
తనవారి ధన సంపదలు మాటలునుగాని
పరవాక్యములు జీడి ఫలములగును
యంత మహానీయుడైనను నిత్యమునుజూడ
సంతలో వజ్రంబు సరసమగును
క్షణము విడువనిభార్య చక్కనిదైనను
సూకరము గాంచిన సూటియగును
ఒకరుజేసిన సుకృతంబు నొకరికగునె
యెవరి కర్మంబు యెటులనో నటులజరుగు
నిలకడయు లేనివారల నీల్గుగాని ॥సకల॥ 13

సీ॥ యెచ్చట పెద్దల యెపుడుసేవించిన
కప్పకు నమృతంబు గలుగబోదు
శాస్త్రముల్ నిత్యము శ్రద్ధగా జదివిన
మార్జాల వీక్షణము మరలిపోదు
మూడువేళల సంధ్యముధముతో జేసిన
శునకము గమనించు సూటిబోదు
పచ్చి ఫలహారముల్ భక్షించిననుగాని
కొంగపాలుద్రాగిన గుణముబోదు
జన్మఫలమన్నుము దలచరు జగతిలోన
పూర్వవాసనలేనట్టి పురుషులకును
కొండద్రవ్విన పరుసంబుగోరిన గతి ॥సకల॥ 14

సీ॥ మర్కటగురువైన మనసు స్థిరముండదు
దీర్ఘవ్యాధియు రోగి తెలివియగును
సూక్ష్మబుద్ధియు లేని శిష్యునిబోధించ
చవిటిభూమిలో బీజచందమగును
ప్రేమయు లేనట్టి పెత్తనంబును జేయు
సరసమెరుగని బాల సౌఖ్యమగును
భావమెరుగనివారి పలుకరించినయపుడు
ముదిరిన వంకాయ ముచ్చటగును
చెరుకు రసమును గ్రోలిన చేదుయగునె
కోవిదుల స్పర్శగల్గిన గుణముచెడునె
యొనుట విద్యామనంబుల నెరుగవలయు ॥సకల॥ **15**

సీ॥ బుద్ధిమంతులకును ప్రేమతో బోధించ
కొబ్బరిలో చెక్కెరగూడినట్లు
సత్పాత్రగల్గిన చక్కని దానంబు
హస్తమున కంకణం బమరినట్లు
పండితసభలోన భావవాక్యంబులు
మాధుర్యరస మనుభవించినట్లు
అంగహీనముగాని యాసరసత్వంబు
పాయసాన్నము భక్షించినట్లు
కార్య కారణములు దెలియు ఘనులకెపుడు
హంస క్షీరంబుగ్రోలును అనుదినంబు
భక్తిపరులకు సామ్రాజ్యపదముగల్గు ॥సకల॥ **16**

సీ॥ నమ్మకములేనట్టి నాథునిగొల్చిన
పాలుయివ్వని బఱ్ఱె ఫలము యగును
తన కాంక్షనెరుగని దనవారిజేరిన
సర్పమును ముద్దాడ సరసమగును
అధికారమున్నదని యందరినిబెదరించ
యెపుడు బంతెగిరిన విధము యగును
రుణము యివ్వనిచోట రూఢిగా యుండిన
చదలుబట్టిన గృహము సామ్యమగును
నీటిమీదను వ్రాతయు నిలువదరమె
అగ్ని శేషంబు యున్నను యారదెపుడు
సమయమెరిగిన సూత్రముల్ సఫలమగును॥సకల॥17

సీ। వగలాడిభార్యకు వార్ధిక్యపతియైన
పాచియన్నము దిను భావమగును
తండ్రి పండితుడైన తనయులు మొద్దైన
ఆనె పెరిగిన కాలు యందమగును
యెకుల మేలోర్చలేనట్టి సోదరులైన
పాపటికాయరుచి పగదియగును
ధనహీనుడైన అల్లుడు యింటనుండిన
అల్లము దిను మర్కటందమగును
తీరెరుంగనివారల జేరియున్న
వలను జిక్కిన పక్షుల వరుసజూడ
కర్మసూత్రంబు జగతికి కారణంబు ॥సకల॥ 18

సీ॥ రాత్రి పగలనకను రక్తిగాదిరుగుచు
 యేమరకయుండును యెప్పుడుజూడ
ధార సుతాదులు తగ బంధుమిత్రులు
ధనము వ్యవహారంబు దలచిచూడ
మేలైనభూములు మేడలు మిద్దెలు
చీనాంబరములును సొగసుజూడ
రత్నభూషణములు రాజిల్లుచుండును
దివ్యతరంబుగా దేరవుజూడ
వైభవాస్పదమంతయు వరుసగాను
మృత్యుదేవత గొనిపోవు ముదముతోడ
ధర్మమే శాశ్వతంబరయ దనకుజూడ ॥సకల॥ 19

సీ॥ జ్ఞానవంతునకు కులగోత్ర భేదములున్న
రహిత సామ్రాజ్యంబు రాదు నిజము
ధనమున్నవారు ధర్మముజేయకున్నను
అగ్నితస్కర నృపులకగును నిజము
ఘడియైన విడనాడకను సతినిగాచిన
పరులపాలగు వాని పత్ని నిజము
మంత్రవాదులకెపుడు మరి తామసంబున్న
కలహకారణములు గల్గు నిజము
తనువు యెవ్వరికిని శాశ్వతంబుగాదు
సమ్మతము శాంతభావ సద్గుణములున్న
మనుజులకు నెపుడు సత్ఫలితమహిమ దనరు॥సకల॥20

సీ॥ కారణాస్పదమయిన కర్మసూత్రంబులు
విడచియుండువు నెపుడు విశదముగను
పట్టాభిషేకంబు పటుతరముగ జేయ
బూనినవశీయిష్టు భూపతియును
యంత్రప్రయత్నంబు యేమైన సాగెన
శ్రీరామునకుజూడ చేయుటకును
విధివశము తప్పక విపినంబునకు నేగె
సతియు అనుజుడు దాను సత్యముగను
నచట పర్ణకుటీరంబునందు యెపుడు
పత్ర ఫల మనుభవించగ బరగవలసె
కాలమహిమయు దెలియదు ఘనులకైన ॥సకల॥ 21

సీ॥ వీరుడైననుగాని విద్యనేర్చినగాని
ధనవంతుడునుగాని ధాతగాని
భక్తుడైననుగాని భావజ్ఞుడునుగాని
పరమనీచుడుగాని పాపిగాని
యోగియైననుగాని భోగియైననుగాని
జూదరైననుగాని జోగిగాని
చక్రవర్తియుగాని చతురుడైననుగాని
రూపవంతుడుగాని రోగిగాని
జారచోరుండు మంత్ర తాంతికుడుగాని
పూర్వసంచిత ఫలమున బుట్టెగాని
వేరె జూడగ లేదిక వెతలుగాని ॥సకల॥ 22

సీ॥ జీవుని గమనంబు చాల విచిత్రంబు
నైదుభూతములలో నమరియుండు
పిండజాండస్వేద భూరుహంబులందుండు
బుద్బుదంబులలోన బుట్టుచుండు
అన్నిజాతులకును నధికమయి దనరుచు
మానవునకు జ్ఞానమహిమయుండు
వాటముగను పంచతన్మాత్రలందున
మేటియగుచు తాను మెలగుచుండు

నలుపు తెలుపున యెరుపులో నమరియుండు
యెటుల పాకంబుజేయునో నటుల రుచియు
గల్గుచుండును తుదవరకు గాంచిచూడ ॥సకల॥ 23

సీ॥ కామాంధకారమున గడు గురూపియునైన
రక్తిగానుండు ఆరమణి యపుడు
అతిఆకలినిజూడ నంబలైననుగాని
యమృతముగా స్వీకరించునపుడు
నిదురవచ్చినయపుడు నెండిన తృణమైన
ఘన మల్లెశయ్యావలె గాంచునపుడు
దొంగకొడుకైనను దుర్మార్గుడైనను
తలిదండ్రికిని ప్రేమ తరుగదెపుడు

దుర్లభంబైన భ్రాంతియు దొలగదీయ
కమలభవునకు సాధ్యంబె గాంచుటకును
వసుధలో మానవునకును వశముయగునె ॥సకల॥ 24

సీ॥ దానధర్మముజేయ దగువారియొద్దను
ధనము యుండకను యెపుడు దలచిజూడ
లోభిపాషండనీచులయొద్ద జూచిన
నెపుడు మహాధనము నెంచిజూడ
స్నాన సంధ్యా జపము చక్కని
ధ్యానంబుగలవారలకు దరిద్రంబుజూడ
తనయులులేరని దలచినవారికి
గలుగదు సంతతి గతియుజూడ

ధాత వ్రాసిన వ్రాతయు దాటగలరె
కర్మ ఫలితాంశమేజూడ కారణంబు
సటుల జరుగుచునుండు నందరికిజూడ ॥సకల॥ 25

సీ। జలధరుండునుజూడ జీవకోట్లకు నెపుడు
నీరంబు నొసగును నిశ్చయముగ
కాలకాలములందు గను రమ్యఫలములు
నొసగు వృక్షంబులు నిశ్చయముగ
మృగసముదాయమునకు భుక్తియునుజూడ
నెపుడు ధరణియొసగు నిశ్చయముగ
సూర్యునికాంతియు జూడగా పద్మముల్
నిర్మలముగనుండు నిశ్చయముగ

పరుల కుపకార మొనరించు ప్రాజ్ఞులకును
దేవతాంశముగల్గును దివ్యముగను
శాశ్వతంబైన పదమును జూడగల్గు ॥సకల॥ 26

సీ॥ నతిభయాకరమయిన ఆమొసలి నోటిలోయున్న
ముత్యము లూడదీయవచ్చు
సప్తమహాసనుల్ చాలగూఢములున్న
యోములనైనను దాటి వెళ్లవచ్చు
సర్పమునైనను చక్కగా నాడించి
శిరమందు ధరియించి జూడవచ్చు
స్వాధీనమునుగాని చెడ్డయేనుగునైన
స్వల్పదారమున బంధించవచ్చు
మూర్ఖజన మనసు రంజింప మోదమగునె
ధాతకైనను వీలౌనె దలచిచూడ
సమయమెరిగి నటించిన చాలశుభము ॥సకల॥ 27

సీ॥ భూమి నాదన్నను భూదేవతయునవ్వు
దానహీనునిగాంచి ధనమునవ్వు
పండితుండని గర్వపడిన వాణియునవ్వు
భయప్రాణికిని యముడు బరగనవ్వు
పుంసకత్వముచెడిన పూబోణియునునవ్వు
గురుభక్తియునుచెడిన గురువునవ్వు
మంత్రహీనునిజూచి మాయభూతమునవ్వు
గాత్రపాటయుచెడిన ఘనులునవ్వు
ధైర్యగుణమును లేకున్న తగనినవ్వు
నిలకడయులేనివారికి నెపుడు నవ్వు
సత్యముగ శంకరుని దలచ చాలనవ్వు ॥సకల॥ 28

సీ॥ తీపులలోకన్న తీపు బ్రహ్మంబును
వస్తువులో సొగసు వనిత జూడ
మతములలోన సమ్మతము భూషణమును
గతులలో మంచి సద్గతియుజూడ
బాధలలో దేహబాధయు నధికంబు
వ్యాధులలో క్షయ వ్యాధిజూడ
శాఖములలో శోభితంబును లవణము
కాంతులలో సూర్యకాంతిజూడ
నీర క్షీరము విభజింప నేర్పరియును
హంసకునుగాని కొంగకు నలవియగునె
గురుతరంబైన సూత్రముల్ గుర్తుగాంచ ॥సకల॥ 29

సీ॥ అప్పుదీరక యున్న యానందముండునే
కుక్కుతల రణబాధ గూడినట్లు
యమునవారింట్లలో నెప్పుడుయుండిన
శివిలి కైమునకును జేరినట్లు
అత్త కోడలకును యనుమతిలేకున్న
కాకి కోవెలయును గలసినట్లు
మూర్ఖజనులనునమ్మి ముదముతోడనుయున్న
కొంగ చేపను జూడ గోరినట్లు
నిర్మలములేని పనులన్ని నెపుడుజూడ
తేలుకుట్టిన సామ్యమా తెలివిగల్గి
జేయు పనులన్నిజూడగా దేటపడును ॥సకల॥ 30

సీ॥ మొదట విద్యయుజూడ యేర్పడును ముఖమున
సంభాషణమున యాసరళిదెలియు
గృహము ముందుజూడ గృహిణి చక్కదనంబు
నేర్పు సుగుణంబును నప్పుడు దెలియు
పాకంబు జేయుచుండిన రుచిభావము
తాలింపు వేయు వాసనయుదెలియు
తల్లిదండ్రుల ప్రవర్తన ధర్మగుణములు
తనయులజూడగ దారిదెలియు

సద్గుణంబులుగల్గిన సరసులకును
ఘడియలో జూడగావచ్చు కారణములు
తెలివిలేనట్టివారికి దెలియ వశమె ॥సకల॥ 31

సీ॥ సంపంగిమాలయు చక్కగా కంఠమున
వేయ సువాసన వదల వశమె
సరసభాషిణితోడ సమరతిజేసిన
మనసు ప్రేమయు జూడ మార వశమె
శ్రవణ ఆనంద గానంబు శోభితమును
విన్న మనుజులకును విడువ వశమె
తన భావమును గ్రహించిన ప్రేమమిత్రుని
నిత్యమున్ జూడక నిలువ వశమె

దేహ భ్రాంతియు వదలుట దుస్తరంబు
శ్రవణ మనన నిధి ధ్యాస సాధనముల
జేయుచుండిన భక్తియోగంబుగల్గు ॥సకల॥ 32

సీ। సంతోషమున స్వారిజేయు కౌతుకనకును
గుఱ్ఱ మల్లరిదైన గొప్పతంట
యెపుడు వ్యవహారంబు యేర్పడియు జేసిన
లాభంబురానిచో నపుడు తంట
పనులన్నియునుగాక పట్టదూ నిద్రయు
మనసు అతి చలనము మాలతంట
చక్కగా రుచిపాకమును లేని భోజనము
జేయుచుండిన యపుడు చెడ్డతంట
సాహసము ధైర్యమే కార్యసాధనముకు
పట్టు విడువరు ప్రౌఢు లేపగదినైన
సత్ఫలము అనుభవంబగు శాంతముననను ॥సకల॥ 33

సీ॥ తన భార్యతో నిత్యమును తగవులాడిన
ఆయింట నడుచు లక్ష్మియునుజూడ
అర్థంబు దెలియనివారలందరికిని
వ్యర్థమైదోచు యేవిద్యజూడ
యెదుటవారలదప్పు లెపుడు వెదుకుచునుండ
దనకువచ్చును వెతల్ దలచిజూడ
నేర్పరియైన నవుకరిని దిట్టినయపుడు
తన గౌరవము చెడును తగవుజూడ
పరులభావము గ్రహియించి బలుకుచున్న
భయము విశ్వాసమును భక్తి బరగుచుండు
నందరికి సుఖముగల్గు ఆనందముగను ॥సకల॥ 34

సీ॥ మంచివాక్యములకు మనసు చొరనివ్వదు
కానిమాటలయందు కాంక్షగల్గు
దేవప్రార్థనకును దీరికయుండదు
పోట్లాటకును జూడ బుద్ధిగల్గు
చెడిపోయినట్టిదానికి శ్రద్ధగల్గును
మహిమ దారినిజూడ మరుపుగల్గు
వికట మనుజుల స్నేహ మెపుడు దలంచును
భక్తులమైత్రి బద్ధకముగల్గు
శాశ్వతముగాని పనులన్ని జేయు నెపుడు
భవహరంబైన మార్గంబు పట్టుపడదు
ఘన సుధర్మము గమనించ గష్టతరము ॥సకల॥ 35

సీ॥ పూర్వ పుణ్యంబున బుట్టినవారికి
అడవిగ్రామంబౌను నందముగను
పరులు మిత్రులు నగు పరభూములునుజూడ
తనకు స్వాధీనము తథ్యముగను
సతియు గుణవతియును చక్కని భోగంబు
పాడిపంటలును బాహుళ్యముగను
కాంచనంబు లభించు కడు రమ్యముగ
సుతుల్ దనరుచునుండును ధర్మముగను
యెచటకేగిన కొరతయు నెపుడురాదు
జన్మఫలితములేనట్టి జాణలకును
యెంతశ్రమపడిన రాదు యేవిధమునైన ॥సకల॥ 36

సీ॥ విడచి విడువకయుండు వెతలుజెందుచునుండు
కామినీజనముల గాంచుచుండు
యందుకుయనుచుండు యపుడు యేడ్చుచునుండు
పుత్రభ్రాంతియుజూడ బొరలుచుండు
శాశ్వితముగాదనుచు చేసుదిరుగుచూనుండు
ధన మిత్ర స్నేహంబు దలచుచుండు
కాని మార్గంబనుచు కాలుదువ్వుచునుండు
ప్రారబ్ధమును యెపుడు పెంచుచుండు
యిన్నివిధముల గమనించుచున్న మనసు
నీవె స్వాధీనమును జేయు నిర్మలముగ
భవహర పరమపురుష ॥సకల॥ 37

సీ॥ యట్టనుచు దెలియక యెరిగివచ్చిన చేప
గాలంబునను జిక్కి గదలకుండ
దీపమని దెలియక దిరుగుచూవచ్చిన
మిడుత వహ్నిలో జేరు మెదలకుండ
మేకనుచు దెలియక మెల్లగావచ్చిన
పులిజేరు బోనులో పోడవకుండ
పెట్టెయనక యెలుక బెజ్జంబువేయగా
పామునోటిలో బడును బలుకకుండ
మనుజులకుజూడ నధికమౌ మాయతెలివి
యనుటవారికి వంచన యపుడుజేయ
తుదకు మృగములగతియాను తోచకుండ॥సకల॥ 38

సీ॥ రంభాదులతోఁగూడి రతిజేసిననుగాని
తృప్తిగామోహంబు తీరదెపుడు
పర్వతంబంతయు బంగారమునుదొరుక
భావసంతోషంబు బడయదెపుడు
వెయ్యి యనఘై శాఖలును వేదములుజూడ
విద్య భ్రాంతియును మరి విడువదెపుడు
వేలు లక్షలకోట్లు వ్యాపారియైనను
నధిక దురాశయు నణగదెపుడు
మనసు అతిచిత్ర గమనంబు మహిమజూడ
జన్మజన్మంబులకునైన జాలుననదు
దీని మరలించుటకు నీకు దెలియుగాని ॥సకల॥ 39

సీ॥ సీతమాటలువిన్న శ్రీరాముడునుజూడ
బంగారు లేడని భ్రమసివెళ్లె
విభవ రాజ్యంబును విడచి జూదంబాడ
వలదనిన మంత్రిని వదలివెళ్లె
అనుజుడుబోధించ నా రావణుడు వినక
అమ్మ బిక్షాందేహియనుచు వెళ్లె
బాలుండుదెల్పిన భావంబు విడనాడి
హరితోడ బోరుటకు నపుడువెళ్లె
కాలమును జెడినయప్పుడు ఘనులకైన
యెవరుజెప్పిన విధిదాట నెవరితరము
అనుభవించక తీరదు నందరికిని ॥సకల॥ 40

సీ॥ యెదుటవారికి భాగ్యమున్నదని యేడ్చినా
తనకు ఆఫలితము తగిలిరాదు
శ్రద్ధచే కష్టంబు జేసెనప్పటికైన
శని బలములేకున్న చేరిరాదు
యెంత యుక్తిగ దాను వ్యవహరించినగాని
సుంతైన లక్ష్మి చేకూడిరాదు
బలముగలదంచును బహు బెదరించినా
సార్థకంబేమైన సాగిరాదు
ప్రాప్తిలేకున్న వచ్చునే ఫలము దనకు
తాను జేసిన కర్మయే తగిలియుండు
పరుల మేలోర్చ శుభమును బడయవచ్చు ॥సకల॥ 41

సీ॥ అతి భయంకరమగు నడవి మృగములలోన
బడినపుడు రక్షణ పరులుయెవరు
అంబుధిలోబడి నల్లాడుచుండిన
దరియు జేర్చుటకును ధాతలెవరు
వహ్నిలోబడినపుడు ఒడలు మంటలుగల్గ
బాధయున్ దీర్చిన భక్తులెవరు
బహు మత్తులోయుండి బడియున్న ప్రాణికి
గాపాడజూచిన ఘనులు యెవరు
పూర్వ సుకృతాంశ పుణ్య ఫలంబుచేత
ఆపదలు గడచు నెంతవారలకునైన
విధిని గుర్తించ నెవరికి వీలు యగునె ॥సకల॥ 42

సీ॥ అన్నము బెట్టిన ఆయింటికిని జూడ
చుట్టాలె అందరు చోద్యముగను
ఫలములుండిన చెట్టునకు పక్షులును యెపుడు
ఆశచే వచ్చు ఆనందముగను
కామినీ వయసునుగాంచినతోడనే
మోహంబు గల్గును మోదముగను
జలముయుండినచోట చక్కగా కప్పలు
జేరి బెకబెకలాడు చిత్రముగను
అన్నియును అణగినప్పుడు యెవరునురారు
చమురులేనట్టి ప్రమిదసామ్యమగును
ముందు జాగ్రతయున్న మోసంబురాదు ॥సకల॥ 43

సీ॥ బాధలున్ గల్గిన భావజ్ఞులును యెపుడు
ధైర్యము వదలరు దలచిజూడ
పర్వతంబునకు బహు ఘాలివీచినగాని
యేమన జంకదు యెపుడుజూడ
వికట మానవులకు వెరువరు భక్తులు
ముదముతోడ హరిని ముందుజూడ
ఘనకార్యమును జేయ గల్గిన వీరులు
మెదలరు మూర్ఖులేమనినజూడ
సాహసము దృఢముయున్న సత్పురుషులకును
మాయలును జేరుచుండిన మనసు జెడదు
నిరత మానందమే జూడ నిశ్చయముగ ॥సకల॥ 44

సీ॥ నిరతము శ్రద్ధగా నెపుడు చదివినగాని
బూడిదలో పన్నీరుబోయురీతి
కాయకష్టముజేసి కట్టెలను గొట్టినా
పట్టతల యొడలో బడినరీతి
అభినయంబును లేని యా వేశ్య పాడిన
అర్థంబు లేని యవ్వనమురీతి
భావంబు లేని మాటలు మెన్నిబల్కిన
కంటకాస్పదమైన కాలురీతి
ప్రాప్తమును లేని పనులన్ని ప్రేమతోడ
యొంత జేసిన నిష్ఫలం బెంచిచూడ
స్వప్నములో ధనముదొరికిన సామ్యమగును॥సకల॥45

సీ॥ శృతిలోన మిళితమయి శోభగాంచిన పాట
సభకు ప్రేమ దనర్చు చక్కగాను
తలవాకిటనుజూడ తాంబూలమును వేయు
జనరంజకంబౌను చక్కగాను
తన స్వకష్టంబున తత్ఫలముగాంచిన
సంతోషమున్ దనరు చక్కగాను
మంచివారితో నెపుడు మర్యాదగాయున్న
సంతతానందంబు చక్కగాను
తెలివిగల్గిన కార్యముల్ జేయుచున్న
నెపుడు శుభమును గల్గును నెంచిచూడ
తనదు సుగుణ ప్రభావంబు ధర్మమరయ ॥సకల॥ 46

సీ॥ అతి వ్యాపకంబున్న అనుదినంబునుజూడ
దేహంబు పుష్టమై తెలివి చేయు
యెంతటికేగిన దనకు యెప్పుడు చాంచలమును
పైత్యంబు నధికమై బలముచేయును
నాయువు క్షీణంబు నరయుచుండును జూడ
యేపదార్థంబు రుచి నపుడు చేయును
తన మాటలును వినరు దరియున్నవారలు
చేరనివ్వరు జూడ స్థిరము చేయును
గాన పటుతరమున్నపుడు గల్గినట్టి
మనసు ఆనందముగయున్న మహిమదనరు
భక్తి రక్తియు భుక్తి అనుభవముగల్గు ॥సకల॥ 47

సీ॥ ధనములేని యప్పుడు దనవివాహంబును
వలదనుచు జెప్పును వసుపుగాను
దాయాదులును దరిలేని సమయంబున
మాయమాటలుబల్కు మంచిగాను
అత్తలేనియపుడు ఆకోడలునుజూడ
పెత్తనంబునుజేయు ప్రేమగాను
తనకు రోగముగల్గినపుడు రామునిదలచు
చూచువారలకు చోద్యంబుగాను
దినము గడచిన లాభంబు దేటయగునె
తనువుతోయున్న పనులన్ని దలచిచూడ
దినక రుచి దిగక లోతును దెలియబడునె ॥సకల॥ 48

సీ॥ పతి భక్తియున్న భార్యకు వ్రతంబులుయేల
విద్యయుండిన యపుడు వేషమేల
పరమ మిత్రుండున్న బంధువర్గంబేల
పాకంబు దెలియని పత్నియేల
సుతులులేని గృహము చూడ సొగసునుయేల
మతిలేని మానంబు మహిమయేల
తనభావమును గ్రహించనియుంపు చోటేల
యెపుడు రోగములు దేహమునుయేల
సుఖము దుఃఖానుభవ ప్రేమ సూటిదెలియ
దన స్వకర్మయె గమనించ తథ్యముగను
నటుల జరుగుచు నుండును నవనిలోన ॥సకల॥ 49

సీ॥ మంచిదినములలోన మహాలక్ష్మియును వచ్చు
మండువేసవి పనసపండ్లురీతి
శనిదృష్టియునుజూడ సొంపుగాయున్నపుడు
నందరు ప్రేమ యింపొందురీతి
ఖండించియున్న మొద్దున కావసంతమున
చక్కగా మొలచిన చిగురురీతి
క్షీణమొందిన చంద్రునకు శుక్లపక్షమున
ఘనమైన కాంతియు గల్గు రీతి
దైవబలమున్న వారికి తత్ఫలంబు
వచ్చుచుండును జూడగ వైభవముగ
లేనిచో పాటు నిష్ఫలము నెంచిచూడ ॥సకల॥ 50

సీ। కానివానితో నెపుడు కలసి వర్తించిన
తాడిక్రింద పాలుత్రాగువిధము
విద్యలేనట్టివారితో నెపుడు మాట్లాడ
పరిమళించని పుష్పమాల విధము
శాఖములేని అన్నమును స్వీకరణయు
గరిక మేయుచునున్న ఖరము విధము
పాటుపడినపుడు అనుభవములేకున్నను
రణము వీపునయున్న రక్తివిధము
తనకు దుష్కర్మఫలితము దగిలియున్న
మంచియును దొలగుచుండు ఆమహిమవలన
కష్టములు గల్గుచుండును ఘనులకైన ।సకల। 51

సీ॥ మనసు నిర్మలమున్న మరి దేహమును యెపుడు
చక్కగానుండును జూడగాను
ప్రాణి ఆనందము బహుధైర్యమును గల్గు
శుక్లంబు తేజస్సు జూడగాను
వాత పైత్య శ్లేష్మములు వనరుగానుండు
జఠరాగ్ని దివ్యమౌ జూడగాను
నపుడు సత్కర్మయోగము దనరుచుండును
సుజన ప్రేమాస్పదము జూడగాను
యిన్నివిధముల నధికారియున్న మనసు
గమనమును దెలియువారికి గలుషహారము
యెచటయున్నను జూడగ నచట శుభము ॥సకల॥52

సీ॥ ఖరము గంధము తరువు కట్టెలను మ్రోయును
గాని సువాసన గాంచగలదె
కుక్క యేమెరుంగు గొప్ప కొద్దియుజూడ
యింటిలో మర్మంబు యెరుగ గలదె
అజ్ఞానియెప్పుడు ఆనందమును లేక
దిరుగుచుండిన దనకు దెలివిగలదె
వాసనా రహితంబు వైభవాస్పదమైన
నమృతంబుగ్రోలుట నలవిగలదె
బాడద్రవ్విన జలమును బడయనగునె
పూర్వసుకృతాంశమును లేక ఫలముగాంచ
సార్థకంబౌనె జూడగ సత్యముగను ॥సకల॥ 53

సీ॥ కొంగ నీళ్లలో యుండి కోరుచుండును యెపుడు
మత్స్యంబులకు జూడ మాయతోడ
ఆవేటగాండ్రును యా మృగంబుల
వలను జిక్కజేయును జూడ శ్రద్ధతోడ
మంచిగోవులజూచి మాయ మృగంబును
గాచియుండును జూడ కాంక్షతోడ
సజ్జనాళికి యెపుడు చక్కగా కుమతులు
వెక్కిరింతురు జూడ వేడ్కతోడ
ఒకరిజోలికిరానట్టి వారలకును
బాధబెట్టినవారి కాఫలముగలదు
తుదకు వీరల గతియు నేమౌనో జూడ ॥సకల॥ 54

సీ॥ మాతృవలె రక్షించు మన్నించు తండ్రివలె
విద్యప్రభావంబు విధముజూడ
యెచటకేగిన ధనము యెపుడు సత్కీర్తియు
విద్యప్రభావంబు విధముజూడ
గురువుగానుంచును గుర్తు కలిగించును
విద్యప్రభావంబు విధముజూడ
సౌఖ్యంబుగల్గించు చక్కగా ప్రేమించు
విద్యప్రభావంబు విధముజూడ
యెవరు హరియించ నలవియె నెపుడు విద్య
బంధు మిత్రులు పోషించు బరగవిద్య
నిత్య ఆనందమునుగల్గు నేర్పు విద్య ॥సకల। 55

సీ॥ ధనములేనియపుడు తలిదండ్రి నిందించు
ధార తనయులు చూడ దరికిరారు
బంధు మిత్రాదులు బలుకరించరు యెపుడు
తన నౌకరుల్ దలంచినను రారు
యెచటికివెళ్లినా యేమియుతోచదు
మన్నించరును చూడ మళ్లిరారు
సజ్జనబృందములో జేరినప్పటికైన
తిన్నగా కష్టంబు తీర్చరారు
మనసు స్థిరముగ నుండదా మహిమ యేమొ
ధైర్యమునుగూడ చెడిపోవు తథ్యముగను
ధనమె దైవము సత్ఫలము దలచిచూడ ॥సకల॥ 56

సీ॥ నాలుగు నరఘుంటలందు హిమాంతము
నరయ చంద్రుని రతువు నపుడుజూడ
జలమునం దమృతము శోభిల్లుచుండును
స్నానసౌఖ్యంబు ఆసరణిజూడ
శౌచము తేజస్సు శాంతభావంబును
మనసు నుత్సాహంబు మరియుజూడ
మలరహితంబును మరి స్వప్న దోషంబు
హరియించు సూర్యదర్శనముజూడ
ఆర్యులందరుగాంచి రీయనుభవంబు
దినము సాధన యీవిధము జేయుచున్న
దేహమును చెడను సోహంబు దివ్యమగును॥సకల॥57

సీ। సృష్టిపోషక లయమునకు చూడ కర్మయే
సుఖ దుఃఖములయందు జూడ కర్మ
దానధర్మంబును దప్పక కర్మయే
స్నాన సంధ్యలయందు జూడ కర్మ
గాన మంత్రములందు గల్పించు కర్మయే
చెడుమార్గమందున జూడ కర్మ
వేదవిద్యలయందు వెలసినది కర్మయే
వధు వరుల వైభవముజూడ కర్మ
సుతులు మిత్రులు బంధువుల్ జూడ కర్మ
యెన్ని కార్యములందును యెపుడు కర్మ
కర్మసూత్ర ప్రభావంబుగాంచ ముక్తి ॥సకల॥ 58

సీ॥ శ్వాస నిశ్వాసలు గమనించు సురతిలో
పడును శుక్లంబును పుష్పమంగ
దినదినంబును సూక్ష్మ దివ్యనాదంబున
అవయవంబులు పెరుగుచుండు నంగ
మాతృ స్వీకరించు మరి భుక్తి సారంబు
శిశు నాభి నాళమున జేరునంగ
రాత్రి పగలనకను రక్తిగా నీరమున
గనులుచుండును యెపుడు గాంచ నందు

పదియోమాసంబునకు చూడ బయిటబడును
అరువదియు లక్ష లిరువయినారు వేల
నాల్గువందల జపముతో నయ్యె తనువు ॥సకల॥ 59

సీ॥ రతిలోన కామంబు రంజిల్లుచుండును
భార్య భర్తలకు భావంబుజూడ
శోణితంబెచ్చిన చూడ పుత్రికయును
శుక్లంబధికమయిన సుతుడు జూడ
శుక్ల శోణితములు సమముగాయుండిన
పుంసకము లేని పురుషుండు జూడ
యింద్రియంబులు చెదర యిరువురు జనియించు
రాజసంబున్న రాజనుడుజూడ

సత్వమెచ్చిన తపసియై జననమొందు
మాతృతమరజము హెచ్చిన మాంధ్యుడగును
తామసంబున్న కోపియు ధర జనించు ॥సకల॥ 60

సీ॥ ధాత్రీ జలంబున దప్పక రతిజేసు
దీర్ఘాయువు గల్గు దేటగాను
అగ్నితత్వంబున ఆరతి సల్పగా
కాలకనిష్టుండు గాంచగాను
వాయుతత్వంబున హాయిగా రతిసల్ప
నల్ప జీవుండును నరయగాను
ఆకాశతత్వమందున రతిజేయగ
క్షీణ నాయువు శిశువు జూడగాను
చంద్రనాడియు భార్యకు సరిగనుండ
సూర్యనాడియు భర్తకు చూడ సుఖము
నపుడు రతిజేయ నమృతమై నలరుచుండు ॥సకల॥ 61

సీ॥ ఆది మంగళ గురు ఆస్తిరవారము
సూర్యనాడియు చూడ శుభముగల్గు
సోమ బుధ శుక్రవారంబులు మూడును
చంద్రనాడియుజూడ శుభముగల్గు
వేకువను నయిదు ఘంటలవేళ మేల్కొని
చూడ ప్రతిదినంబు శుభముగల్గు
ఆదినా బొనాడి నడువకున్నను జూడ
కార్య అశుభంబును గాంచగల్గు
నాశికంబున కుడి సూర్యనాడినడచు
యెడమ భాగంబు చంద్రునినాడి యెపుడు
స్వరములును జూడ జ్ఞానసిద్ధియును గలుగు॥సకల॥62

సీ॥ విద్య దీక్ష కొలువు వితరణ వ్యాపార
వింత ప్రాయు దీక్ష వేడ్కజూడ
సంగీత సాహిత్య సరసకవిత్వంబు
సకల వస్తుక్రియా సరణిజూడ
మంత్ర యంత్ర తంత్ర మారణవుచ్చాట
స్తంభన మోహనాస్పదముజూడ
శస్త్ర మైరావత సంభోగ భయస్నాన
ఆహార యశ్వ స్వారియునుజూడ
జారచోరత్వ శిల్పాదిజాల పనుల
యడవి మృగముల వేటాడ నరయు వేళ
సూర్యనాడియు నడచిన శుభముగల్గు ॥సకల॥ 63

సీ॥ రత్న భూషణములు రాజుదర్శనమును
రాగ వీణ మృదంగ రక్తియందు
దేవ ప్రతిష్టల దేశగమనంబున
ద్రవ్య సంగ్రహ వైద్య దానమందు
సత్కర్మ అనుకూల సంగర వుపనయన
సకల యోగ వివాహశాంతియందు
భావి తటాకముల్ బరగు గృహంబులు
వస్త్ర అలంకార వాంచలందు
నూతనగృహ శంకు నిర్మాణమునకు
సకల బీజములనువేయు సమయమునను
చంద్రనాడియు నడచిన చాల శుభము ॥సకల॥ 64

సీ॥ రక్తబలమున్నపుడు రాణించు దేహంబు
మోహంబు గల్గును ముఖముజూడ
నపుడు వాక్కును దృఢము నరయ జ్ఞాపకమును
మనసు ఆనందము మరియుజూడ
పది యింద్రియంబులు పటుతరముగనుండు
రాకట పోకట రక్తిజూడ
సమ్యోగప్రేమయు చక్కనితనయులు
సతి వైభవంబును సమముజూడ
యన్నియును జెడక యున్నపుడు యరుక మరచు
యున్నవారికి సద్గతియు నెపుడురాదు
శక్తిమహిమయె శంకరుని సేవజేయ ॥సకల॥ 65

సీ॥ ఆనదుల్ పొంగివచ్చిన సముద్రుండును
జేర్చును తనలోన స్వచ్ఛముగను
తనయులు యెంతఅల్లరిజేసినను
తల్లి సంతోషముగ జేర్చు సత్యముగను
భక్తుని ధ్యానంబు భవహరుడు వీక్షించి
తుదకు తనలో జేర్చు సిద్ధముగను
ఆలమందలో దూడ నరుచుచుండినయపుడు
యాగోవు జేర్చును యందముగను
యినుడు వుదయించ హిమము దా నేగురీతి
సజ్జనుల కష్టముల జూడ సఫలముగను
దీర్చుచుండును యీశ్వరుడు దివ్యముగను ॥సకల॥6

సీ। యెపుడు హరి కీర్తనల్ యేమరకను విన్న
వారిదే జన్మయు వసుధయందు
హరి మందిరమున అనుదినము భజనయు
జేయ వారిదే జన్మయు వసుధయందు
నిత్యము హృదయము నిర్మలంబుగ యున్న
వారిదే జన్మయు వసుధయందు
యెదుట యాపదలను యెపుడురక్షించిన
వారిదే జన్మయు వసుధయందు
జాతి మత భేద మిచటను జూడలేదు
యెదుడు వీరలదరికిని యెపుడురాడు
దురితములుజూడ హరియించు త్రోవయిదియో॥సకల॥

సీ॥ బాల్య యవ్వనముల భక్తియు గుదురదు
తురగ గమనంబు ఆదెరవుజూడ
దేహ పటుత్వంబు చెడిన యోగంబును
మాగిన ఫలము ఆమహిమజూడ
కౌమారమున ధ్యానకారణాస్పదమును
చల్లలో వెన్న ఆసరణిజూడ
సంసారసుఖమును శాశ్వితమని దలచ
వారి బుద్బుదము లావిధముజూడ
మృత్యుదేవత నిత్యము మురయుచుండు
భవహరంబైన మార్గంబు పట్టుపడిన
వారలకు గల్గు మోక్షంబు వైభవముగ ॥సకల॥ 68

సీ॥ భయభూత నఘముల బరగు స్నానంబున
మాధవున్ దలచిన మహిమగల్గు
ఆహారపానంబు ఆనిద్ర వేళను
మాధవున్ దలచిన మహిమగల్గు
సంభోగ వ్యవహార సరణి విద్యలయందు
మాధవున్ దలచిన మహిమగల్గు
బంధు మిత్రాదుల పాశబంధంబున
మాధవున్ దలచిన మహిమగల్గు
నిత్య సత్కర్మమును జేయుచున్న నెపుడు
స్త్రీలకును పురుషులకునైన శాశ్వతంబు
మాధవుని ధ్యానమే మోక్ష మరసిజూడ ॥సకల॥ 69

సీ॥ అజ్ఞానమును యెపుడు అణగజాలదు యని
ప్రతిమలు జ్ఞాను లేర్పరచెజూడ
విగ్రహాభావంబు విశదమంతయు దెలియ
శ్రద్ధ భక్తియును శాంతమునుజూడ
వీక్షణాస్పదమున విమల లక్ష్యంబును
మనసు చలనంబణగు మహిమజూడ
నెపుడు వాక్శుద్ధియు నిర్మలంబుగ గల్గు
సత్కర్మ ఆచరణ సమముజూడ
తాను నిర్మించు రూపంబు తానె దలచ
చలనమును లేని స్వస్వరూపంబుగాంచు
నపుడు మోక్షంబు సిద్ధించు నరసిజూడ ॥సకల॥ 70

సీ॥ కోవెలకును యెపుడు కూత సొంపుగనుండు
నవచూతపత్రముల్ నమలుచుండు
శుకము పలుకులు యెపుడు చూడ చక్కగనుండు
రుచి ఫలంబులు స్వీకరించుచుండు
గోవులకును తుష్టి గొప్పగానుండును
పచ్చి తృణంబు భక్షించుచుండు
సజ్జనాళికి యెపుడు సద్భక్తియుండును
యీశ్వరామృతము సేవించుచుండు
జన్మ ఫలితంబె నటుల జేయుటకు దనరు
అనుదినంబును యానంద మమరు జూడ
మధ్యగా భక్తి తక్షణము మరలుచుండు ॥సకల॥ 71

సీ॥ స్నాన సంధ్యలు జేసి శాంతముగాయున్న
యిది యొక డాంబీకమనుచు బల్కు
శాస్త్రముల్ శోధించి శ్రద్ధగా బోధించ
విసుకువచ్చునటంచు నెపుడు బల్కు
భక్తిగా రాముని పద ధ్యానములను జేయ
మాయ భక్తియనుచు మరియు బల్కు
మౌనముచే యెపుడు మననము జేయుగ
విమతుడు యితడని యెసురుబల్కు
యిన్ని విధములకు జనుల కెపుడునుండు
భక్త హృదయాస్పదం బనుభవంబుజూడ
చంద్ర శేఖరునకు దెలియు చక్కగాను ॥సకల॥ 72

సీ॥ నీ మంత్ర ధ్యానము నెపుడు జేయుచునుండు
బ్రహ్మరాక్షసుల భయమును దొలంగు
నీకీర్తనలుజూడ నెపుడు గానముజేయ
యమకింకరుల బాధయును దొలంగు
నీ నామస్మరణయు నెపుడును జేసిన
దురిత జాలములన్నియును దొలంగు
నీపాదపద్మముల్ నెపుడు సేవించిన
కర్మబంధమును గాంచిన దొలంగు
తారకాధిప మహాలింగ ధవళవర్ణ
మారహర భక్తమందార మహిమపురుష
కరుణజూడర ప్రణుతాంగ గరళకంఠ ॥సకల॥ 73

సీ॥ వరుసగా నాయువు నూరువత్సరములు
జీవితము నటించు జూడగాను
నందు నిత్యంబును నరయగా మృత్యువు
సన్నిహితమయి యుండు చక్కగాను
యేక్షణంబునజూడ యెపుడు గొనిపోవునో
కాలమున్ దెలియదు ఘట్టిగాను
దేహమున్నయపుడు దెలివిగా భక్తితో
శంకర ధ్యానంబు జేయగాను
దనకు తోడౌను నంత్య సాన్నిధ్యమందు
సత్పదముచెడదు జూడగ సత్యముగను
నిరత మానందమార్గంబు నెవరికైన ॥సకల॥ 74

సీ॥ దంతముల్ వూడ తను బలమున్నపుడు
ధార తనయులు ప్రేమ దరుగనపుడు
తనువు రోగంబును దరిజేరనప్పుడు
కనులు పగలును రాత్రి గాంచునపుడు
చెవులకు బధిరము చేరియుండని యపుడు
జిహ్వాయందున చొంగ జారనపుడు
పాద నడకయుజూడ పటుతరమున్నపుడు
చక్కగా భుక్తియు జరుగునపుడు
అవయవంబులు అన్నియు నణగనపుడె
వేద వినుతాంగ యీశ్వర యనుచు వేడ
తనకు మోక్షంబు సిద్ధించు తథ్యముగను ॥సకల॥ 75

సీ॥ సుర అసుర భూపతుల్ జూడ ధాతయు మునులు
నిన్నె ధ్యానింతురు నిగమవేద్య
యమ కుభేరాగ్ని యింద్రాది దిక్పాలకుల్
నిన్నె ధ్యానింతురు నిగమవేద్య
భృంగి చండీశ్వర ప్రమథగణాదులు
నిన్నె ధ్యానింతురు నిగమవేద్య
యక్ష గంధర్వ కింపురుష విద్యాధరుల్
నిన్నె ధ్యానింతురు నిగమవేద్య
నిర్మలుండవు గుణరహిత నిర్గుణుడవు
నందరికి ప్రభుడవీవు ఆనందముగను
దీనరక్షణ బ్రోవరా దేవ దేవ ॥సకల॥ 76

సీ॥ తల్లి గర్భము మైల తనదేహమును మైల
మైలలో పెరిగిన మడియుగలదె
నవద్వారములు మైల నరయ భోగముమైల
మరియు గమనము మైల మడియుగలదె
భుక్తిచూడగ మైల బరగ మాటలు మైల
ఆ నిద్రలో మైల మడియుగలదె
మలమూత్రములు మైల మరి శోణితము మైల
మహారోగములు మైల మడియుగలదె
మలినరహితంబు సద్భక్తి మడియుజూడ
తారకానంద సాధనము తగిన మడియు
ద్వాదశాత్ముని వీక్షించ దివ్యమడియు ॥సకల॥ 77

సీ। జీవాత్మ పరమాత్మయందు నైక్యముజేయు
నది రాజయోగంబు నరసిజూడ
ప్రాణపానంబులు బరగ కుంభించిన
నది హఠయోగంబు నరసిజూడ
మనసు వాక్ స్మరణయు మరి భావమున్ గలయు
నది భక్తియోగంబు నరసిజూడ
ఓనమ శివ రామముల నుపాసించిన
నది మంత్రయోగంబు నరసిజూడ
అన్నిటికి భక్తియోగ మానందమగును
సూక్ష్మమార్గంబు మనసు సుస్థిరము దనరు
ప్రథమ సోపానమునుజూడ భవహరంబు ॥సకల॥ 78

సీ॥ జన్మంబు యెచటనో జరుగుట యెచటనో
యున్న స్థల మెచటనో యోచిచూడ
వృద్ధియు నెచటనో వైభవంబెచటనో
ద్రవ్యంబు యెచటనో దసరుచూడ
విద్యనేర్చుట నెచటనో వివరంబు యెచటనో
ధార సుతులెచటనో దలచిచూడ
సద్భక్తియెచటనో చావును యెచటనో
గమనంబు యెచటనో గల్గు చూడ
యిన్ని విధములు దెలియుట నెవరితరము
ప్రమథగణ సేవితానంద పరమపురుష
నీవె కారణకర్తవు నెపుడు జూడ ॥సకల॥ 79

సీ॥ ధనముకన్నను మిగుల తన కుమారుడు హెచ్చు
దన కుమారునికన్న తనువు హెచ్చు
తనువుకన్నను జూడ తన యింద్రియము లెచ్చు
యింద్రియములకు ప్రాణి నెపుడు హెచ్చు
ప్రాణికన్న నధికము బరగ హంసయు హెచ్చు
ఆహంసకన్న లక్ష్యంబు హెచ్చు
లక్ష్యాస్పదముకన్న నా ఆత్మయును హెచ్చు
ఆత్మకంటెను లేదు నరయ హెచ్చు
అన్నిటికి హెచ్చు అయినది ఆత్మగాన
దీని సాధించువారు సుధీరులరయ
మోక్ష సాంబ్రాజ్యసూత్రంబు ముఖ్యముగను॥సకల॥

సీ॥ అండపిండములో బ్రహ్మాండమందున నెపుడు
ప్రణవంబె జూడగా పరిణమించు
రాజస తత్వ తామసములయందును
ప్రణవంబె జూడగా పరిణమించు
తారక సోహము దనరు హంసలజ్యోతి
ప్రణవంబె జూడగా పరిణమించు
ఆరు చక్రములందు నరయ త్రివేణిలో
ప్రణవంబె జూడగా పరిణమించు
యిడ పింగళ నాడుల నెపుడు దిరుగు
వేదములు మొదలు శాస్త్రముల్ వెదకిజూడ
ప్రణవసాధన బోధయే పరమునకును ॥సకల॥ 81

సీ॥ దేహంబునకు మొదలు దివ్యమయినది శిరసు
భావించువారికి పరము అచట
దశ యింద్రియములకు దలపగా నయనముల్
వీక్షించగా జ్యోతివిమలమచట
సత్కథల్ వినుటకు శ్రవంబు లధికమహా
నాదానుభవమును నలరు నచట
అతి వందనము జేయు నరయ హస్తంబులు
దాసోహమయినట్టి దారి అచట
అన్నిటికిరాజు మనసు అధికారిజూడ
మనసునకు రాజు హంసయే మహిమదనరు
రాజులకు రాజు యానందరాజు ఆత్మ ॥సకల॥ 82

సీ॥ పరమేశ్వరుని పాదపద్మముల్ సేవయు
యీడ పింగళులును యెపుడుజూడ
మేరు పర్వతము యెక్కుటకును మెట్లును
ఆరుచక్రంబులు నరయజూడ
వీక్షణాస్పదమైన విమలజ్యోతులకాంతి
యందు లక్ష్యమున దర్శనముజూడ
పంచ వింశతి తత్వములయందు గమనముచే
ఆనందమయియుండు హంసజూడ

దీనిభావంబెరిగిన ధీరు లరయ
సాధనంబైన మార్గంబు సత్యముగను
దేశికుని సూత్రమున గాని దేటపడను ॥సకల॥ 83

సీ॥ ఆయాసమునుగల్గు నలరు యీంద్రియముల
కాననము వర్జించగలను శుభము
స్వప్న సందడిజూడ సౌఖ్య పరంపరల్
చలనమణచిన చిత్తమునకు శుభము
చక్కని మార్గంబు సకల భవహరంబు
తారక వీక్షణము దనరు శుభము
తత్వ ఆనందము తన జన్మరహితము
యోగ భావంబును యెపుడు శుభము

మనసునకు నిర్మలంబును మరియుజూడ
విధి నిషేధంబులును లేని విద్య గాన
శోధనాత్పర సౌఖ్య శుభప్రదంబు ॥సకల॥ 84

సీ॥ దొంగ కన్నములోన దూరు సమయంబున
వాక్ మనసు కాయంబు ఒకటిజేయు
తర్వాత లోపలకు తాను ప్రవేశించి
ఘన కాంచనమును సంగ్రహాముజేయు
నటుల వాక్ ద్వారంబు నణచి పైభాగమున
జేరి త్రిపుటిలో హంస చక్కజేయు
నపుడు పరధనంబు లభియించు చూడగ
గురుడు ఆవిధ మొనగూర్పజేయు

సాధనంబున గాంచిరి సకలమునులు
బాట యెరిగినవారికి భయములేదు
కోటయును జూడ నెప్పుడు కొరతగలదె ॥సక॥ 85

సీ॥ హస్తము శిరమున యాస్పర్శజేయుట
పక్షి దీక్షయు అనుభవంబుజూడ
లక్ష్యాంశమున నపుడు నా గురుసూచన
మత్స్యంబు దీక్షయు మరియుజూడ
హంస నిరూపణ యోగమనంబును
కూర్మదీక్షయు దెల్పుటకునుజూడ
తుమ్మెద నాదంబు తీరైన సూత్రంబు
వాక్కుదీక్షయును మరి వరుసజూడ

వేదదీక్ష నయిదు వెలయ క్రియాదీక్ష
నారుదీక్షల దెల్పె నతడె గురుడు
సాధనంబున గమనించ సార్థకంబు ॥సకల॥

సీ॥ జ్ఞానమను పాలలో గలయు బిందనె చల్ల
విరిగి గుణమనె దధియు వెలయుచుండు
దేహ భాండంబున దధియును బడవేయ
వెన్న కవ్వంబును మెసటనుండు
నందు యిడ పింగళుల్ నరయ త్రాళ్లచే ద్రిప్ప
కవ్వంబునకు వెన్న గల్గుచుండు
లక్ష్యంబునను దీసి నపుడు వహ్నిలో గాంచ
ఆరుచియు నమృతమై నలరుచుండు
సాధనంబున గురునిచే చక్కగాను
దెలియువారికి జూడగ దివ్యపదవి
మనసు ఆనందమునుగల్గు మాయదొలగు ॥సకల॥ 87

సీ॥ చీమలకు దివ్యదృష్టియు చక్కగానుండు
యేమరక గమనంబు యెపుడుజూడ
కోడి కాలముదెలసి కొక్కరో యనుచుండు
నాల్గు ఘంటలకును నరసిజూడ
నటుల జ్ఞానముతోడ నరయగా లక్ష్యమున
సూర్యకాంతియును గన్పడునుజూడ
ఆకాలమున్ యెరిగి ఆసోహంగమనంబు
జేయ యోగమునకు సిద్ధిజూడ
యెరుక మరువకయుండిన యెపుడు దనకు
నిర్మలంబైన మార్గంబు నపుడు గాంచు
సర్వ సంకల్పనాశనము స్వచ్ఛముగను ॥సకల॥ 88

సీ॥ వేద శాస్త్రార్ధముల్ విశదమెరింగిన
నీవార భావంబు నెరుగలేడు
గాయిత్రి మంత్ర వుపాసనాపరుడైన
సూర్యుని తేజస్సు జూడలేడు
యెపుడు ప్రాణాయామమును జేయుచున్నను
ఆసుషుమ్నంబు గమనించలేడు
యెన్ని ఆసనములు యేర్పడి వేసిన
ఆధారమునుజూడ నరయలేడు
దేహవాచక సూత్రముల్ దెలియబడునె
గురుని సాధన భావంబు గుర్తెరుంగు
వారలకుగల్గు సాంబ్రాజ్య వైభవంబు ॥సకల॥ 89

సీ॥ సర్వేశ్వరుని భక్తి చక్కగా యుండిన
నవగ్రహంబుల ప్రేమ నలరుచుండు
యెపుడు జ్ఞానము యోగసాధనము యేర్పడిన
దనకు దైవ బలంబు దనరుచుండు
సత్కర్మ పరునకు సర్వదేశంబుల
మనుజులందరును మన్నించుచుండు
మంచి బుద్ధియుగల్గి మరి పండితుండైన
యెచటకేగిన సుఖము యెపుడునుండు
భావ పరిశీలనంబైన బాటయున్న
హానియును చూడ రాబోదు అజ్ఞులకును
మాయలును జేయ నరులకు మహిమగలదె॥సకల॥ 90

సీ॥ వినయము భయభక్తి విశ్వాసమును లేక
కుదురునే గురుసేవ గుర్తుగాను
మంత్రభావార్థ రహస్యమున్ దెలియక
చదివిన ఫలమేమి శ్రద్ధగాను
యారుచక్రములందు నరయ గమనముజేసి
శృంగాటమును జేరి చూడగాను
నపుడు సుషుమ్నమునందు మహాతేజము
గన్పడుచుండును ఘనముగాను
అనుభవాస్పదమయిన సాధనముచేత
దెలియవచ్చును నాత్మలో తేటగాను
వాదభేదనపరులకు వశముయగునె ॥సకల॥ 91

సీ॥ కాననంబులో యున్న కందమూలముదిన్న
ప్రాణిరక్షణగాని ఫలము లేదు
కాషాయములు వేసి ఘన జడల్ దాల్చిన
మోతచేటే దనకు ముక్తి లేదు
రుద్రాక్షమాలలు రూఢిగా వేసిన
బరువుమోచుటగాని ఫలము లేదు
సప్త మహానదుల్ స్నానంబు జేసిన
కాయసిద్ధియు నైన గలుగ లేదు
నాశికములోన సోహద్యానాస్పదంబు
వారణాసియు గన్పడును వైభవముగ
దర్శనంబౌను యాశివుడు ధన్యులకును ॥సకల॥ 92

సీ॥ చూపుజూడగ సర్వజీవులు చూచేటి
యాచూపులో చూపు నెపుడుజూడ
ఆత్మ స్వరూపుండు నచట భాసిల్లును
ఆనందముగ లక్ష్యముననుజూడ
చలనములేకను చక్కని మనసుతో గాంచ
నిర్మల మచటగల్గు జూడ
కోటిసూర్య ప్రభాకాంతియు గన్పడు
నందులో గురు దర్శనమునుజూడ
నపుడు వాక్కుతో వచియింప నలవియగునె
తాను తరియించునదియె తారకము జూడ
నెపుడుజూచిన రహితమై యెనుటనుండు ॥సకల॥ 93

సీ॥ నొకచోట నేలయు నొకచోట బొంతయు
నొకచోట పరుపును నెంచిచూడ
నొకచోట యన్నము నొకచోట ఆకులు
నొకచోట నీరంబు నెంచిచూడ
నొకచోట పాయసము నొకచోట ఫలములు
నొకచోట పాలును నెంచిచూడ
నొకచోట పస్తును నొకచోట దుస్తును
నొకచోట గోచియు నెంచిచూడ
కార్యసాధనమును యోగి గాంచుచుండు
సుఖము దుఃఖము దేహ సహజంబు యనుచు
శంకరుని ధ్యానమును జేయు శ్రద్ధగాను ॥సకల॥ 94

సీ॥ యేవూరు నీదని హేళన జేసిన
చక్కనిమనంబుజూడ చెడదు
మాలవాడో వీడు మంచివాడో చూడ
బ్రాహ్మడు గాడనిన భక్తి చెడదు
శూద్రుడో వైశ్యుడో చూడగా క్షత్రియుడో
డాంబికుడో యితడనిన దారి చెడదు
భాషలుగల్గిన బహు వేషధారియో
మోసగాడో యనిన ముదము చెడదు

పామరులు యెన్నివిధములు బల్కనేని
నిరత మానంద యోగి నిశ్చయముతోడ
ధీరతను యెపుడు గమనించు దివ్యముగను ॥సకల॥95

సీ॥ జలసమీపంబున చక్కగా యోగంబు
జేయగా వృష్ణంబు శాంతమగును
సిద్ధాసనంబున స్థిరముగా గూర్చుండి
నెమ్మదిగ సాధించ నేర్పయగును
వీణదండంబున విమలమయియుండిన
హంసభావంబు ఆనందమగును
ఆహార నిద్రయు నధికంబు లేకుండ
సమముగాయుండిన సఫలమగును

చంద్ర రుతువున గమనించ సార్ధకంబు
ఆత్మ తేజంబు నధికమై నలరుచుండు
యిదియె అనుభవమార్గంబు యెపుడుజూడ ॥సకల॥96

సీ॥ తడిలేని తీర్థంబు పొడి ప్రసాదము దానె
తాంబూలమును దక్షిణయును దానె
అష్టాంగముల యెపుడు ఆనందమును దానె
మనసు మారుతలక్ష్య మహిమ దానె
ఆరు దీక్షలయందు నరయుచుండుట దానె
ప్రవిమల మంత్ర పుష్పంబు దానె
గురు నమస్కారంబు గూరిమితో దానె
నిండు సమాధిలో నేగు దానె

యిన్నిటికి మూలమయినది యెరుక జూడ
అనుభవము లేక వచియించ నలవియగునె
సాధనాంశంబునను దెలియు చక్కగాను ॥సకల॥ 97

సీ॥ ధవళకాంతియు నెపుడు దనరు స్ఫటికంబును
చిత్రరంగులుదోచు త్రిప్పిజూడ
ఆకాశమున నీల మమరినట్లుండును
యేదినంబున నేత్రములకు జూడ
గదలని చంద్రుడు గమనించు నీళ్లలో
యనుచు దలంచును యపుడుజూడ
త్రాడు కదిలినయపుడు దప్పక పామని
యనుచు దా గాంచు భయమునను జూడ

యెన్నివిధముల భ్రాంతి యేర్పడును మాయ
కలలో గాంచిన గజ సామ్యమగును తుదకు
నిశ్చయాంబైనదే బయలు నెందుజూడ ॥సకల॥ 98

సీ॥ మౌని స్తోత్రావన మహనీయ గుణసాంద్ర
భక్తవర దాక్షిణ్య పార్వతీశ
నీ కటాక్షంబున నే రచించితి గాన
సీస శతకంబు శ్రీ మహేశ
ప్రాస లక్షణ యతుల్ పద్ధతి యెరుగను
పాలనజేయుము భవ వినాశ
కరుణవీక్షించు కళ్యాణచంద్రధర
యోగ రతానంద వ్యోమకేశ
విశ్వకర్మాన్వయుండను విమలచరిత
నాను మానందస్వామియు నాగభూష
తనయుడను నేను మన్నించు తండ్రివీవు ॥సకల॥ 99

సీ॥ మంగళము శంకరా మంగళము భవహరా
మంగళము యోవరద మహిమ తేజ
మంగళము మదనహర మంగళము యీశ్వరా
మంగళము సర్పధర మహిమ తేజ
మంగళము ధవళాంగ మంగళము చంద్రధర
మంగళము భూతేశ మహిమ తేజ
మంగళము రక్షకా మంగళము జయదేవ
మంగళము సాంబశివ మహిమ తేజ
మంగళము లోకపాలన మహిమ తేజ
మంగళము బుధజనస్తోత్ర మహిమ తేజ
మంగళంబిదుగో గౌరీశ మహిమ తేజ ॥సకల॥ 100